SIMULTANEOUSLY PUBLISHED FROM VIJAYAWADA AND MADRAS.

# ఆంధ్రపత్రిక

Regd. No H. 506 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO సంపుటం 52, సంచిక 232

విజయవాడ, శుక్రవారం 26-11-1965 THE ANDHRA PATRIKA MORNING * * 6 పుటలు 8 పైసలు





# బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం సవరణ బిల్లుపై చర్చ వాయిదా

## లోక్‌సభలో ప్రతిపక్షాల ప్రయత్నం సఫలం: 137-51 ఓట్ల తేడాతో కామత్ ప్రతిపాదనకు విజయం

న్యూఢిల్లీ, నవంబరు 25:

**బెనారస్ హిందూ విశ్వ విద్యాలయం సవరణ బిల్లుపై చర్చను వాయిదా వేయాలని ప్రతిపక్షంవారు ప్రతిపాదించిన తీర్మానాన్ని లోక్‌సభ నేడు 137-51 వోట్ల తేడాతో ఆమోదించింది.**

శ్రీ హెచ్. వి. కామత్ ప్రతిపాదించిన తీర్మానంపై జరిగిన వోటింగ్ ఫలితాన్ని సభాపతి ప్రకటించినప్పుడు, ప్రతిపక్షాలలో ఒక వర్గం వారు "సిగ్గు సిగ్గు" అని కేకలు వేశారు.

చర్చకు మరొక తేదీని దేనిని నిర్ణయించలేదు.

వాయిదా వేయాలన్న తీర్మానాన్ని శ్రీ కామత్ (పి.ఎస్.పి.) ప్రతిపాదించారు. దీనిపై శ్రీయుతులు మసాని (స్వతంత్ర) హిరేన్ ముఖర్జీ (కమ్యూ.)లు గట్టిగా ఆక్షేపం తరము చెప్పారు.

శ్రీ మసాని "ఇట్టి ప్రతిపాదనసే ఎక్కువ మెజారిటీతో త్రోసివేస్తే ఉన్నది గనుక, విద్యామంత్రి బిల్లుమీద వోటింగ్‌కు పూర్తి స్వేచ్ఛ ఇచ్చియున్నారు గనుక, ఈ తీర్మానాన్ని పెట్టరాదని, ఈ వాయిదా తీర్మాన ప్రతిపాదనను 186, 38 సూత్రాల ప్రాతిపదికపై త్రోసివేయా"లని వాదించారు.

—o:o—

### టౌన్ ప్లానింగ్ శాఖలు

న్యూఢిల్లీ, నవంబరు 25: నగర అభివృద్ధి బృహత్ ప్రణాళికలు అమలు చేసేందుకు, దేశంలోని అన్ని మునిసిపల్ కార్పొరేషన్‌లు టవున్ ప్లానింగ్ శాఖలను గాని యూనిట్లను గాని ఏర్పాటు చేయాలని, పట్టణ, గ్రామ పథకాల సంస్థ సూచించింది.

## రైతులకు బోనస్

### మైసూరు నిర్ణయం

(స్వకీయ విలేఖరి)

బెంగుళూరు, నవంబర్ 25: రైతులు ఇష్టపడి లేదా లెవీ పద్ధతిని కొనుగోలు చేసే ప్రతి క్వింటాల్ వడ్లకు అయిదు రూపాయలు చొప్పున బోనస్ ఇవ్వడానికి మైసూరు మంత్రివర్గం నేడు తీర్మానించింది. ప్రభుత్వం నిర్ణయించిన ధరకాక, ఈ మొత్తాన్ని అదనంగా ఇస్తారు.

మైసూరుకు కొరతగా ఉన్న బియ్యం, జొన్నలు, రాగులు, పప్పు ధాన్యాలు వెంటనే సప్లయి చేయడానికి ఆంధ్ర, మద్రాసు పంజాబు రాష్ట్ర ప్రభుత్వాలు అంగీకరించాయి.

### ఆంధ్రనుంచి 3 వేల టన్నుల బియ్యం

ఆంధ్రప్రదేశ్ నుంచి వెంటనే 3000 టన్నుల బియ్యం మైసూరుకు సప్లయి చేయగలమని ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డి తనకు వ్రాసినట్లు మైసూరు ముఖ్య మంత్రి శ్రీ నిజలింగప్ప నేడు ప్రకటించారు. ఇందుకు శ్రీ బ్రహ్మానందరెడ్డికి కృతజ్ఞత తెలుపుతూ శ్రీ నిజలింగప్ప ఇలా అన్నారు:

"భిక్షా పాత్రతో తిరిగి నేను మరల ఆయన వద్దకు వెళ్లవలసి ఉంటుందనే అనుకుంటున్నాను."

## రాష్ట్రంలో వర్షాభావ పరిస్థితి

### కేంద్రానికి వ్రాతపూర్వకంగా వివరణ

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు, నవంబర్ 25: ఆంధ్రప్రదేశ్‌లోని మెట్ట తాలూకాలలో వర్షాభావం వల్ల తీవ్రంగా కొరత ఉన్నదని కేంద్ర ప్రభుత్వ దృష్టికి తెస్తున్నామని ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి నేడు శాసన పరిషత్తులో తెలిపారు.

కేంద్ర ఆర్థిక మంత్రి దేశంలో కరువు పరిస్థితులు గురించి ఇచ్చిన రాష్ట్రాల జాబితాలో ఆంధ్రను చేర్చలేదని, ఇది ప్రభుత్వం గమనించిందా అని శ్రీ ఎ. సదాశివం అడిగారు. ఈ సంగతి శాసన సభలో తమ దృష్టికి తేబడిందని, వారు నిజంగా అట్టి ప్రకటన చేస్తే, అది పొరపాటు అని, రాష్ట్రంలోని యథార్థ పరిస్థితిని కేంద్ర ప్రభుత్వ దృష్టికి మళ్లీ తెస్తామని ముఖ్య మంత్రి అన్నారు.

కేంద్ర ప్రభుత్వం ఇట్టి నిర్ణయాలు చాలా చేస్తున్నదని శ్రీ ఎ. సీతారామిరెడ్డి అనగా, ముఖ్యమంత్రి చాలా లేవని, ఈ సంచర్భంలో మనము వారికి వ్రాస్తామని అన్నారు.

నేడు ఆహార మంత్రి ఢిల్లీ వెళుతున్నారు గనుక, వారు కేంద్ర మంత్రితో మాట్లాడడం యుక్తంగా ఉంటుందిదిగదా అని శ్రీ మాలకొండారెడ్డి అడుగగా "మీరు యుక్తం అనే, చెప్పడం—అది యుక్తం గాకుండా ఉండడమూ" అని ముఖ్య మంత్రి అంటూ వ్రాత పూర్వకంగా పంపితే బాగుంటుంది అన్నారు.

### భీమా సంస్థ విభజన

న్యూఢిల్లీ, నవంబర్ 25: జీవిత భీమా సంస్థను 5 స్వతంత్ర సంస్థలుగా విభజించాలని పబ్లిక్ ఎకౌంట్సు కమిటీ చేసిన సూచనను ప్రభుత్వం పరిశీలిస్తున్నదని నేడు లోక్‌సభలో ఆర్థిక సహాయ మంత్రి శ్రీ బి. ఆర్. భగత్ తెలియజేశారు.

శ్రీ పి. ఆర్. చక్రవర్తి తదితరులు వేసిన ప్రశ్నకు మంత్రి సమాధానం చెబుతూ జీవిత భీమా సంస్థను పటిష్టం చేసే విషయం ఏక సభ్య సంఘం పరిశీలనలో ఉన్నదని తెలియజేశారు.



చైనా సహాయం పట్ల నేపాల్ ప్రజలకు చాలా అసంతృప్తి కలిగింది — వార్త

## విశ్వవిద్యాలయాల బిల్లులు: శాసనసభ ఆమోదం

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి) హైదరాబాద్, నవంబర్ 25:

**ఆంధ్ర శ్రీ వెంకటేశ్వర, ఉస్మానియా విశ్వవిద్యాలయాల సవరణ బిల్లులను, నేడు రాష్ట్ర శాసనసభ ఆమోదించింది.**

మొట్టమొదట ఆంధ్ర విశ్వవిద్యాలయ సవరణబిల్లుపై చర్చకు మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు సమాధానమిచ్చిన అనంతరం క్లాజువారీ చర్చ ప్రారంభమైంది. ప్రతిపక్షాలతో చర్చ జరుగుతుండగా, తమ సవరణల కన్నింటికి ప్రభుత్వం పెడచెవిని పెట్టి నిర్లక్ష్య వైఖరిని ప్రదర్శిస్తున్నది గనుక, తాము అంతా సభనుంచి నిష్క్రమిస్తున్నామని పేర్కొంటూ ప్రతిపక్ష సభ్యులు అంతా సభనుంచి బయటకు వెళ్ళిపోయారు.

సభాపతి శ్రీ బి. వి. సుబ్బారెడ్డి అధ్యక్ష స్థానంలో ఉన్నారు. మిగిలిన రెండు బిల్లులను శ్రీ వెంకటేశ్వర, ఉస్మానియా విశ్వవిద్యాలయాలకు చెందినవి— ప్రతిపక్ష సభ్యులు సభలో లేనందువల్ల తేలికగానే శాసనసభ ఆమోదించింది.

సభానాయకులయిన ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి తమ పరిమితమైన కోర్కెలను సవరణలను అంగీకరిస్తారేమో అని పదేపదే విజ్ఞప్తి చేసినా, ఆయన అంగీకరించనందుకు విచారిస్తున్నామని సభనుంచి నిష్క్రమిస్తున్నామని ప్రతిపక్ష నాయకుడు శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ప్రకటించారు.

ప్రభుత్వం మొండిపట్టుతో ఏ విధమైన అంగీకారానికి రాక, తమ సవరణలన్నింటిని త్రోసివేసినందుకు నిరసనగా తాము నిష్క్రమించడం జరుగుతున్నదని చెప్పి వారు బయటకు వెళ్లి పోయారు.

నేషనల్ డెమోక్రాట్ల పక్షానికి చెందిన శ్రీ తెన్నేటి విశ్వనాథం ప్రభృతులు, స్వతంత్ర పార్టీ సభ్యులు, ఇండిపెండెంట్ సభ్యులు, (శ్రీ నావిలాల గోపాలకృష్ణయ్య ప్రభృతులు) ప్రతిపక్ష నాయకుని అనుసరించారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయ సవరణ బిల్లుకు ప్రతిపక్షాల వారు తెచ్చిన 53 సవరణలు పూర్తిగా వీగిపోయినవి.

అంతకు ముందు ఆంధ్ర విశ్వవిద్యాలయం బిల్లుకు శ్రీ ఎన్. గిరిప్రసాదరావు (కమ్యూ) ప్రభృతులు తెచ్చిన సవరణలన సభాపతి త్రోసివేశారు.

పార్లమెంటులో కూడా నేడు బెనారెస్ విశ్వవిద్యాలయం బిల్లును సభాపతి వాయిదా వేశారని, అలాగే చేయుడానికి ఈ సభకు అన్ని హక్కులు ఉన్నవి గనుక అటువంటి సంప్రదాయం లేకపోయినా సృష్టించను వచ్చు కదా అని శ్రీ టి. కె. ఆర్. శర్మ, శ్రీ గిరి ప్రసాదరావు మున్నగువారు అన్నారు.

సభకు ఏ హక్కయినా ఉన్నదని, అయితే బిల్లును వాయిదా వేయాలన్న సవరణను తాము అప్పుడే త్రోసివేశాము గనుక ఇక ఏమీ లాభం లేదని సభాపతి శ్రీ సుబ్బారెడ్డి అన్నారు.

రూల్సులో లేకపోయినా సభ్యులకు అన్యాయం జరుగకుండా చూడగలిగామని అయితే ఈ విషయంలో తమ నిర్ణయాన్ని యిచ్చి వేయడం జరిగిందని ఆయన చెప్పారు.

బిల్లును ప్రజాభిప్రాయానికి పంపాలని: సంయుక్త పరిశీలన సంఘం పరిశీలనకు తిరిగి పంపాలని, ప్రస్తుత ఉపాధ్యక్షుని అయిదేళ్ళ పదవీకాలం పూర్తి అయిన తర్వాత ఈ బిల్లును అమలు జరపాలని ప్రతిపక్ష సభ్యులు శ్రీయుతులు పిల్లలమర్రి, ఎన్. ప్రసాదరావు, డి. సీతారామయ్య, కె. గోవిందరావుగార్లు ప్రవేశపెట్టిన మూడు సవరణలు కూడా వీగి పోయినవి.

బిల్లును ప్రజాభిప్రాయానికి పంపాలనే సవరణను వోటింగ్ పెట్టగా అనుకూలంగా 24 వోట్లు, వ్యతిరేకంగా 110 వోట్లు వచ్చి సవరణ వీగిపోయింది.

మూడవ పటనం ప్రారంభమైనప్పుడు క్లాజువారీ చర్చలో 6వ క్లాజును వోటింగుకు పెట్టినప్పుడు ఆ క్లాజు యథాతథంగానే ఉండాలని 96 వోట్లు, ప్రతిపక్ష సవరణకు అనుకూలంగా 24 వోట్లు వచ్చాయి.

—o:o—

### హైదరాబాద్‌కు కుర్తాళం పీఠాధిపతి రాక

(ఆంధ్ర పత్రిక ప్రతినిధి)

హైదరాబాద్, నవంబరు 25: శ్రీ కుర్తాళం పీఠాధిపతులు నేడు హైదరాబాద్ వచ్చారు. శాంతినగరంలో శ్రీ పి. రామకృష్ణారావు యింట్లో బస చేస్తున్నారు. నాలుగు రోజులపాటు వీరు రాజధానిలో ఉంటారు. ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, సభాపతి శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, శ్రీ తెన్నేటి విశ్వనాథం ప్రభృతులువారిని కలుసుకొన్నారు.

## సిక్కింలో చైనా కవ్వింపు చర్యలు

న్యూఢిల్లీ, నవంబరు 25: 50 మంది సాయుధ చైనా సైనికులు ఉత్తర సిక్కింలోని బోన్‌చో వద్ద 1500 గజాల వరకు విస్తుమ చొచ్చుకొని వచ్చారు.

అక్కడ కాపలా ఉన్న భారత గస్తీదళం చైనీయులను వెనక్కు వెళ్లమని హెచ్చరించింది. కాని వారు ఆ హెచ్చరికను పాటించక ఇంకా చొచ్చుకు వస్తూ ఉండడం చూచి, భారత గస్తీదళం వారు, ఆత్మరక్షణకై కొన్ని కాల్పులు చేశారు. అంతట చైనీయులు వెనక్కు తగ్గి టిబెట్ ప్రాంతంలోకి వెళ్లిపోయారు.

మూడు రోజుల క్రిందట ఈ ప్రాంతంలో ఇలాంటి సంఘటనే సంభవించింది.

సిక్కిం—టిబెట్ సరిహద్దులను ఇలా అతిక్రమిస్తూ, కవ్వింపు చర్యలు కొనసాగిస్తున్నందుకు భారత్ ప్రభుత్వం నేడు చైనాకు గట్టి నిరసన తెలియజేసింది. తెగించికొనసాగిస్తున్న ఇలాంటి దురాక్రమణ చర్యలకు ఇక స్వస్తి చెప్పాలని కోరింది.

—o:o—

### ఫ్యూడోర్జీ

ఖాట్మండూ, నవంబరు 25: భారత ప్రభుత్వం ప్రకటించిన సస్పెన్షన్ ఉదంతాలకు అందుకోసేందుకు, నేపాల్ ప్రభుత్వం ఫ్యూడోర్జీకి అనుమతి యిచ్చింది.

## కాంగోలో కసవుబూ ప్రభుత్వం పతనం

### జనరల్ మొబుటూ నాయకత్వాన సైనిక ప్రభుత్వం ఏర్పాటు

లియోపోల్డ్‌విల్, నవంబరు 25:

**రక్తపాత రహితంగా జరిగిన సైనిక విప్లవంలో కాంగో సైన్యాధికారి జనరల్ జోసెఫ్ మొబుటూ నేడు అధ్యక్షుడు జోసెఫ్ కసవుబూను పదవీచ్యుతుని చేసి, తన నాయకత్వం కింద సైనిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాడు.**

లియోపోల్డ్‌విల్ రేడియో నేటి ఉదయం ఈ విప్లవాన్ని గురించిన ప్రకటన చేసింది.

ప్రధానమంత్రి శ్రీ కింబా స్థానే కర్నల్ లియోనార్డ్ ములాంబాను, జనరల్ మొబుటూ నియమించినట్లు ఈ ప్రకటన పేర్కొన్నది.

శ్రీ కింబాను శ్రీ కసవుబు నియమించి ఇంకా పది రోజులే అయింది.

పదమూడు ప్రధానాంశాలుగల ఈ అధికార ప్రకటన, కసావుబూ ప్రభుత్వం రాజకీయ రంగంలో పూర్తి అపజయాన్ని వైఫల్యాన్ని ఎదుర్కొంటున్నది. గనుక దానిని తొలగించాలని నిన్న అత్యున్నత సైనికాధికారుల సమావేశం నిర్ణయించినట్లు ప్రకటింపబడింది.

53సం.ల కసావుబూ తమనివాస గృహాన్నిరేపు వదలివేస్తారని ఒక సన్నిహితవర్గం చెప్పింది.

ఈ మార్పుల ఫలితంగా లియోపోల్డ్‌విల్‌లో పెద్ద మార్పేమీ కానరాలేదు. నగరంలో అధికంగా ఎలాంటి సైనిక గస్తీలు ఏర్పాటు చేయలేదు.

రేడియో కార్యాలయంలో మాత్రం కొంచెం మంది సైన్యం కాపలా ఉన్నారు.

### 20 రూపాయల నోట్లు జారీ

### కేంద్రం నిర్ణయం: టి. టి. కె. ప్రకటన

న్యూఢిల్లీ, నవంబర్ 25: 20 రూపాయల నోట్లు జారీ చేయుటానికి రిజర్వు బ్యాంకుకు అధికారం యివ్వాలని కేంద్ర ప్రభుత్వం నిశ్చయించినట్లు నేడు లోక్‌సభలో ఆర్థిక మంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి ప్రకటించారు.

ఈ నోట్లకు ఉన్న గిరాకీని అనుసరించి ఎన్ని నోట్లు జారీ చేయాలీ అనే విషయాన్ని రిజర్వు బ్యాంకు నిర్ణయించు గలదనీ, ఈ రకం నోట్లు తప్ప ఏ కొత్తరకం నోట్లు జారీ విషయం పరిశీలనలో లేదని మంత్రి తెలియజేశారు.

## 62కు పూర్వం ఉన్న శిస్తు మాత్రమే వసూలు

### ప్రభుత్వానికి అడ్వొకేట్ జనరల్ సలహా

### అదనపు శిస్తు చట్టంపై హైకోర్టు తీర్పు ఉల్లంఘన జరగబోదని రెవిన్యూమంత్రి ప్రకటన

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి) హైదరాబాదు, నవంబరు 25:

**1962 అదనపు శిస్తు చట్టం రాజ్యాంగ విరుద్ధమని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తీర్పు ఇచ్చిన దరిమిలా ఆ చట్టం క్రింద శిస్తు వసూళ్లు జరుగుతున్నట్లు ప్రభుత్వానికి ఎట్టి సమాచారం అందలేదని రివెన్యూ మంత్రి శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి ఈ వేళ శాసన సభలో చెప్పారు. ఈ విషయమై ప్రభుత్వం ఇదివరకే జారీచేసిన ఆదేశాల దృష్ట్యా హైకోర్టు తీర్పును ఉల్లంఘించటం జరుగదని ఆయన సభవారికి హామీ ఇచ్చారు.**

అదనపుశిస్తు చట్టానికి సంబంధించి శ్రీ వావిలాల, మరో ఎనిమిదిమంది ఇతరులు తెచ్చిన సావధాన తీర్మానానికి ప్రత్యుత్తరమిస్తూ, శ్రీ రామచంద్రారెడ్డి ఈ ప్రకటన చేశారు. ప్రభుత్వం ఈ విషయమై అడ్వకేట్ జనరల్‌ను సంప్రదించిందనీ, 1962 అదనపుశిస్తు చట్టం రూపొందక మునుపు అమలులోవున్న రేట్ల ప్రకారం శిస్తు వసూలు చేయవలసిందిగా ఆయన సలహా ఇచ్చారనీ మంత్రి తెలియజేశారు.

హైకోర్టు తీర్పుదృష్ట్యా సర్‌ఛార్జి బకాయిలు గాని, శిస్తు గాని వసూలు చేయరాదంటూ సభ్యులు చేసిన సూచనను ప్రస్తావించి, 1957 సర్‌ఛార్జి చట్టంక్రింద రావలసిన శిస్తుగాని, బకాయిలుగాని వసూలుచేయడానికి ఆక్షేపణ ఏమిటో స్పష్టం కాలేదని శ్రీ రామచంద్రారెడ్డి అన్నారు. ఒక్క మెదక్ జిల్లాలోనే 1957—1961 మధ్యకాలానికి గాను సర్‌ఛార్జిచట్టంక్రింద సుమారు 1.82 లక్షల రూపాయల బకాయిలు ఉన్నాయనీ, తహశీల్దార్ శిస్తు మదింపు చట్టానికి అనుగుణంగా చేసి ఉండకపోతే, బాధితులు డిప్యూటీ కలెక్టరుకు అప్పీల్ చేసుకునేవారనీ ఆయన వివరించారు. ఇలాంటి సర్‌ఛార్జి బకాయిలు వసూలు చేయటం చట్టవిరుద్ధమేమీ కాదని ఆయన వాదించారు.

1962 అదనపు శిస్తుచట్టంపై ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఇచ్చిన తీర్పును శ్రద్ధగా పరిశీలించవలసి ఉన్నదనీ, అందులో చట్ట సంబంధమైన పెక్కు ముఖ్యసమస్యలు మిళితమై ఉన్నాయనీ శ్రీ రామచంద్రారెడ్డి తెలియజేశారు. హైకోర్టు తీర్పుమీద మరో కోర్టుకు అప్పీలు దాఖలుచేసుకొనటం దనీ, అంతేకాక అదనపు శిస్తుకు సంబంధించి ఉత్తర్వులు జారీ సిందిగా సుప్రీమ్‌కోర్టును కోర ప్రభుత్వం యోచిస్తున్నదనీ కూడా చె

అంతకుముందు శ్రీ వి. కృష్ణయ్య మాట్లాడుతూ చట్టంక్రింద శిస్తు వసూళ్లు రివెన్యూ అధికారులకు ప్రభు ఇచ్చినట్లు తమకు సమాచారం ఆ శిస్తు చెల్లించవలసిందని రైతులకు డిమాండు నోటీసులను తక్షణం ఉపసంహరించాలనీ అన్నారు. అదనపుశిస్తుచట్టం అమలులోవున్న కాలంలో చేసిన వసూళ్లను తిరిగి ఇచ్చివేయమని ప్రభుత్వం ఆదేశాలు జారీచేసిందో లేదో ఆయన తెలుపకోరారు.

శ్రీ ఎన్. మోహన్‌రావు ప్రసంగిస్తూ, అదనపుశిస్తు బిల్లును శాసనసభలో ప్రవేశ పెట్టినప్పుడే, అందులోవున్న అంశాలకు ప్రతిపక్షాలు ఆక్షేపణ తెల్పాయనీ, ఆ చట్టం అమలులోకి వచ్చి, రైతులకు ఎంతో ఆందోళన కలిగించిందనీ తెల్పారు. ఇంత జరిగినమీదట కనీసం హైకోర్టు తీర్పునైనా ప్రభుత్వం గౌరవించాలని ఆయన అన్నారు.

చట్టాన్ని కొట్టివేస్తూ, హైకోర్టు ఇచ్చిన తీర్పుదృష్ట్యా అసలు శిస్తే వసూలు చేయరాదనీ, రైతులకు డిమాండ్ నోటీసులు పంపవద్దని ప్రభుత్వం తన అధికారులకు స్పష్టమైన ఆదేశాలు జారీచెయ్యాలనీ శ్రీ టి. కె. ఆర్. శర్మ అన్నారు.

మంత్రి ప్రకటన వెలువడినమీదట, శ్రీ పిల్లలమర్రి మాట్లాడుతూ రెండురోజుల క్రితం ఆయన (మంత్రి) ఒక ప్రశ్నకు సమాధానంగా తెల్పినదానికి మించి, ఈవేళ అందజేసిన సమాచారమేమీ లేదన్నారు. గ్రామాలలో శిస్తు వసూళ్లు అప్పుడే ప్రారంభమయ్యాయో లేదో మంత్రి ఖచ్చితంగా తెలుసుకోలేకపోయారని కూడా శ్రీ పిల్లలమర్రి అన్నారు.

ప్రతిపక్ష నాయకుని ఆక్షేపణలకు రివెన్యూ మంత్రి ప్రత్యుత్తరం ఇవ్వలేదు.

—o:o—

### ఢిల్లీకి నేపాల్ రాజదంపతుల రాక

### దేశంలో 20 రోజుల పర్యటన

న్యూఢిల్లీ, నవంబరు 25: భారతదేశంలో 20 రోజులు అధికార పర్యటన జరిపే నిమిత్తం నేపాల్ రాజు మహేంద్ర, రాణి రత్న, నేటి మధ్యాహ్నం, ఖాట్మండూ నుంచి విమానంలో ఇచ్చటికి వచ్చారు.

రాజదంపతులకు విమానాశ్రయంలో, రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్, ప్రధాని శ్రీ శాస్త్రి స్వాగతం చెప్పారు.

రాజదంపతుల పరివారంలో నేపాల్ మంత్రిమండలి ఉపాధ్యక్షులు, విదేశాంగమంత్రి శ్రీ కీర్తినిధి బిస్టా, పోర్టుఫోలియోలేనిమంత్రి శ్రీ ..., విదేశాంగ కార్యదర్శి శ్రీ ... ఉంటారు. వీరు ... 16 గురు యీ పరివారంలో ఉంటారు.

సాయంత్రం లాంఛనప్రాయంగా రాష్ట్రపతిని నేపాల్ రాజా రాజధానిలో ... విస్తృత కార్యక్రమం ప్రారంభిస్తారు. రాజదంపతుల గౌరవార్థం రాత్రి రాష్ట్రపతి విందు ఇస్తారు.

28 వ తేదీ మొదలుకొని, రాజదంపతులు భారతదేశంలో విస్తృత పర్యటన ప్రారంభిస్తారు.

## శాస్త్రి కోరిన విధంగా చర్చలకు పాక్ సమ్మతి

### —భుట్టో ప్రకటన

మాస్కో, నవంబర్ 25:

**సోవియట్ భూభాగంలో ఎక్కడయినా సరే జరిగే అధినాయకుల సమావేశంలో 'మొత్తం భారత్ - పాకిస్తాన్ సంబంధాల సరళిని' గురించి ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రితో చర్చించడానికి అధ్యక్షుడు అయూబ్‌ఖాన్ సిద్ధపడగలరని పాకిస్తాన్ విదేశాంగమంత్రి శ్రీ జడ్. ఎ భుట్టో నేడిక్కడ ప్రకటించారు.**

పాశ్చాత్య, సోవియట్ విలేఖరుల సమావేశంలో శ్రీ భుట్టో ప్రసంగిస్తూ భారత, పాకిస్తాన్‌ల నాయకులు తాష్కెంట్‌లో సమావేశం కావడానికి మంచి అవకాశాలు కలవని అన్నారు.

ఈ పత్రికా గోష్ఠికి భారతీయ విలేఖరులను ఆహ్వానించలేదు.

ఉభయ దేశాల మధ్య గల మొత్తం సంబంధాలను చర్చించాలన్న శ్రీ శాస్త్రి కోర్కెను పాకిస్తాన్ ఆమోదించినదని శ్రీ భుట్టో తెలిపారు.

అయితే బేషరతుగా సమావేశం కావడానికి సంసిద్ధతను వ్యక్తం చేయడంలో పాకిస్తాన్‌వలె భారతదేశం ముందుకు రాలేదని ఆయన అన్నారు.

## అమ్మకంపన్ను రూ.1కి 2-3 పైసలు పెంపు

### వడ్లు, బియ్యం హోల్‌సేల్ దార్లకు పన్నులో రిబేటు: రాష్ట్ర ప్రభుత్వం ప్రతిపాదన

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి) హైదరాబాదు, నవంబరు 25:

**అమ్మకంపన్నుల రేట్లను నూటికి 2 నుంచి 3 వంతులకు పెంచడానికి ఉద్దేశించిన అమ్మకం పన్నుల చట్టం సవరణబిల్లు ఒకటి నేటి అసాధారణ గెజెట్‌లో ప్రచురించబడింది. శాసనసభ సభ్యులకు కూడా నేడు దానిని అందజేశారు.**

**రాష్ట్రంలో మొదటి హోల్‌సేల్ డీలర్ నుంచి రాష్ట్రంలో విక్రయించే బియ్యానికి వసూలుచేసే అమ్మకం పన్నును రూపాయికి నాలుగు నుంచి ఆరు పైసలకు ఈ బిల్లు ప్రకారం పెంచుతున్నారు.**

అయితే రాష్ట్రంలో విక్రయించిన వాడుకున్న బియ్యం మీద రూపాయికి రెండు పైసలు చొప్పున రిబేట్ ఇవ్వడానికి కూడా రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది.

వడ్లు రాష్ట్రంలో తొలి కొనుగోలు జరిగినప్పుడు విధించే పన్నును రూపాయికి 3 నుంచి 5 పైసలకు పెంచుతూ, రాష్ట్రంలో కొని, వాడకం చేసుకొనే వడ్ల మీద రూపాయికి రెండు పైసలు చొప్పున రిబేట్‌కు అవకాశమిస్తూ చట్టంలోని రెండవ షెడ్యూల్ సవరణ కూడా ఈ బిల్లు ఉద్దేశిస్తున్నది.

వ్యాపారం (బిజినెస్) అనే పద నిర్వచనంతో, లాభం కోసం, నిర్వహింపబడని క్లబ్బుల వంటి వానిని కూడా చేర్చడానికి ఈ బిల్లులో ఏర్పాటు జరిగింది. ప్రస్తుతం క్లబ్బులు పన్ను నుంచి మినహాయింపు చేయబడి ఉన్నవి.

ఈ బిల్లు లక్ష్యాలు ఉద్దేశ్యాలు కింది విధంగా వివరించారు:

ఈ మధ్య జరిగిన దక్షిణ రాష్ట్రాల ఆర్థిక శాఖల కార్యదర్శుల సమావేశంలో, అమ్మకం పన్నుల రేట్ల విషయంలో దక్షిణాది రాష్ట్రాలన్నింటికీ ఒకేరకమైన రేట్లు ఉండేటట్లుగా తగు చర్యలు తీసుకొనడం అవసరమని భావించబడింది. అమ్మకం పన్నుల సామాన్య రేట్లు నూటికి 22 నుంచి మూడు వంతులు పెంచాలని సూత్రంగా ఏకాభిప్రాయానికి, వచ్చారు. దాని ఫలితమే ఈ బిల్లు.

### మహారాష్ట్రకు బ్రిటిష్ ప్రతినిధివర్గం రాక

### కార్యక్రమాల బహిష్కరణకు ప్రతిపక్ష సభ్యుల నిర్ణయం

నాగపూర్, నవంబర్ 25: భారతదేశంలో పర్యటిస్తున్న ఏడుగురు సభ్యుల బ్రిటిష్ పార్లమెంటరీ బృందం ఆగమనం సందర్భంగా మహారాష్ట్ర శాసన సభ సభాపతి, శాసన పరిషత్ అధ్యక్షుడు ఆ బృందం గౌరవార్థం ఏర్పాటు చేసిన కార్యక్రమాలన్నింటినీ రెండు సభలలోని ప్రతిపక్ష సభ్యులు బహిష్కరించారు.

ఇటీవలి భారత్ పాక్ పోరాటంలో బ్రిటన్ అవలంబించిన పక్షపాత వైఖరికి నిరసనగా తాము, మిగిలిన ప్రతిపక్ష సభ్యులు ఈ కార్యక్రమాలను బహిష్కరిస్తున్నట్లు ప్రతిపక్ష నాయకుడు శ్రీ కె. ఎన్. ధులప్ శాసన సభాపతికి వ్రాసిన లేఖలో తెలియజేశారు.

